శ్రీ శివాయ గురవేనమః

# మోక్షస్వరూపనిర్ణయము

'మహోపాధ్యాయ' బ్రహ్మశ్రీ

ముదిగొండ నాగలింగశాస్త్రిగారిచే

రచింపఁబడినది.

శ్రీమత్త్రిలోకగురు చెన్నమల్లికార్జునారాధ్యవంశ సంభూతులును, ఘట్టేపల్లి రాజలింగారాధ్య తనూభవులును, సిద్దిపేట గ్రామవాస్తవ్యులు నగు

లోకారాధ్యులైన బ్రహ్మశ్రీ

నాగ[illegible]హారాధ్యులవారి

ధన సాహాయ్యకముచే

ముద్రాపితము

1937

[రు 0—4—

శ్రీశివాయ గురవే నమః

# ఉపోద్ఘాతము

## అవధరింపుడు

ఆర్యవరులారా!

సకలపురుషార్థములలో మోక్షమే శ్రేయమనియు నయ్యది ఆధ్యాత్మికశాస్త్ర సిద్ధమగునుపాయముననే ప్రాప్యమనియు గ్రహించి యాధ్యాత్మికశాస్త్రము పలుత్రోవలుగా ప్రచారములో నున్నకారణమున వానిలో వృద్ధపరంపరచే నభిమానింపఁబడినదానికన్న స్వయముగా విమర్శించినమీద సర్వప్రమాణసమ్మతముగాఁ దేలిన మార్గమె శ్రేయమనియు నమ్మి నేటికి ప్రచారములో నున్నవానిలో నేమార్గము సమంజసముగా నున్నదో కనిపెట్టుకుతూహలము గలవాడనై "అతీంద్రియార్థే శ్రుతిరేవమానం॥" ఇంద్రియములకుఁ గనపడని విషయమునందు శ్రుతియే ప్రమాణమనియు శ్రీవేదాచార్యుఁడు బ్రహ్మసూత్రములయందు నిర్ణయించినదే వేదార్థమనియు బ్రహ్మసూత్రభాష్యములయందు వివరింపబడిన యర్థములలో ఆర్జవముగలిగి నిర్దుష్టమైనదే వేదవ్యాససమ్మతమైనయర్థమనియు నమ్మి నేటికి ప్రచారములో నున్న శ్రుతిసూత్రభాష్యములను వానివానివ్యాఖ్యానములనేగాక వానివానిమీద నేటివఱకు నేర్పడిన ఖండనమండనగ్రంథములనుగూడ నిశ్శేషముగా పరిశీలించి యందు సమంజసమైనమార్గము గ్రహించి యుపనిషదర్థములవిమర్శము వేదపథమనియు బ్రహ్మసూత్రార్థములవిమర్శము వ్యాసపథమనియు గావించి రెంటిని జేర్చి బ్రహ్మపథ మనుగ్రంథమును సంస్కృతభాషయందు రచించితి.

మఱియు, సిద్ధాన్త-అధికారి-సాధన-జగత్ - బ్రహ్మ-జీవ-గతి-ముక్తి స్వరూపములను ప్రత్యేకముగా నిర్ణయింపనెంచి యీపదార్థములను వివరించు సకలమైన నానామత శ్రుతిసూత్ర భాష్యాదిగ్రంథములను విమర్శించి వేదాన్తార్థపరిష్కారశారహార మనుగ్రంథమును సంస్కృతభాషయందే రచించితి.

అంత సకలదేశపండితులకును విదితమగుటకై యీరెండుగ్రంథములను దేవనాగరలిపియందు ముద్రింపించి హిందూదేశముననేగాక విదేశమునను సుప్రసిద్ధులగుపండితుల కనిపితి.

ఇఁక వీనియందు గలవిశేషములను దేశభాషలలో ప్రచురింపఁదలచి వానిలో ముఖ్యమైనమోక్షస్వరూపమును ఆంధ్రభాషయందు ప్రచురింపించడమైనది. కావున సుజనులు ఈగ్రంథము నాదరముతో పరిశీలించి నాపరిశ్రమమును సార్థకము గావింతురని నమ్ముచున్నాఁడను.

ఇట్లు,

మహోపాధ్యాయ,

ముదిగొండ నాగలింగశాస్త్రి

(తెనాలి - గుంటూరు డిస్ట్రిక్టు.)

శ్రీ శివాయ గురవేనమః.

# మోక్షస్వరూప నిర్ణయము

ప్ర॥ ముక్తి యనగా నేమి ?

ఉ॥ ముచిల్-మోక్షణే॥ అను ప్రమాణమువలన విడుపు అని తెలియుచున్నది.

ప్ర॥ ఎద్దానికి విడుపు ?

ఉ॥ సంసారబన్ధమున కని గ్రహించునది.

ప్ర॥ సంసారబంధము విడిపోవుటవలన నేమి ప్రయోజనము ?

ఉ॥ జననము, మరణము ననునవియు తాపత్రయము మొదలైనదుఃఖంబులును సంసారబంధమువలననే కలుగుచున్నవి గాన నయ్యవి నివర్తించుటయు నన్నిటికన్న నధికంబును నిత్యంబును నగుసుఖము ప్రాపించుటయు ప్రయోజనము.

ప్ర॥ సంసారపాశము విడిపోయినప్పుడు ముక్తుఁ డెట్లుండును ?

ఉ॥ శ్రు॥ నిరంజనః పరమం సామ్య ముపైతి॥ఛాం॥ నిరంజనః - అంజన మను సంసారబంధము విడిపోయినవాఁడు - పరమమ్ - అత్యన్తమైన - సామ్యమ్ - బ్రహ్మముదగు సారూప్యమును - ఉపైతి - పొందుచున్నాఁడు - శ్రు॥ సోఽశ్నుతే సర్వా న్కామా న్సహ బ్రహ్మణా విపశ్చితేతి॥ తైత్తి॥ సః— ముక్తి నొందినవాఁడు - విపశ్చితా - సర్వజ్ఞుఁడైన, బ్రహ్మణాసహ - బ్రహ్మముతో గూడ - సర్వాన్ - సకలవిధములయిన - కామాన్ - భోగములను - అశ్నుతే - అనుభవించుచున్నాఁడు అను ప్రమాణములనుబట్టి ముక్తుఁడు సారూప్యమును (బ్రహ్మతో సమానమైనరూపమును) సాయుజ్యమును-బ్రహ్మముతోగూడియుండుటను పొంది సకలసుఖముల ననుభవించుచుండునని తెలియుచున్నది.

ప్ర॥ శ్రు॥ సోఽశ్నుతే సర్వా న్కామా న్సహ బ్రహ్మణా॥ సః=ముక్తుఁడు, సర్వాన్ = సకలమైన, కామాన్ = భోగములను, అశ్నుతే = అనుభవించుచున్నాడు. ఎట్లన, బ్రహ్మణా = బ్రహ్మస్వరూపముతో, సహ = ఒకప్పుడే, అనగా తానే బ్రహ్మమై సకలభోగముల ననుభవింపఁగాఁ గలుగుమహానందముతో

సమానమైనబ్రహ్మానందము ననుభవించునని యిట్టు లీవాక్యము నిర్గుణముక్తి పరముగా నన్వయింపఁబడినదిగాన నీవాక్యమునకు సగుణముక్తిపరమగు నర్థమెట్టు లుచితమగును ?

ఉ॥ శ్రు॥ సోఽశ్నుతే అనువాక్యము సగుణముక్తిపరమే యగుగాని నిర్గుణముక్తి పర మెంతమాత్రమును కానేరదు.

ప్ర॥ ఎందువలన ?

ఉ॥ నిర్గుణపక్షమునందు మోక్షము అశరీరత్వరూపమై నిర్విశేషమేగాన నందు భోగముల ననుభవించుట యసంభవము. మఱియు, కామాన్ అను బహువచనంబువలనను దానికి సర్వాన్ అనువిశేషణంబువలనను నుద్దేశింపఁబడిన విశేషములు నిర్విశేషమగువస్తు వొక్కటే యనుపక్షమునందు నరిపడనేరవు గావున, ఇదిగాక, నిర్గుణపక్షమునందు నేను కర్తను గా ననుభావమే మోక్షము గాన నప్పుడు అశ్నుతే = అనుభవించుచున్నాఁడని కర్తృత్వము విరుద్ధమగును. ఇంతియేగాక, ఈవాక్యమును నిర్గుణముక్తిపరముగాఁ జేసిన యన్వయము బ్రహ్మమీమాంసకును విరుద్ధము.

ప్ర॥ అది యెట్లు ?

ఉ॥ సూ॥ భోగమాత్రసామ్యలింగాచ్చ॥ అనుసూత్రమునందు శ్రు॥ సోఽశ్నుతే అనువాక్యము విషయవాక్యముగా గ్రహించి ముక్తినొందినవాఁడు బ్రహ్మముతో సమానముగా సకలభోగముల ననుభవించునని సిద్ధాన్తము చేయబడియున్నది. దీనింబట్టి యీవాక్యము సగుణపరమేయని యేర్పడుచున్నది.

ప్ర॥ ఈయధికరణము నిర్గుణముక్తిపరము గాదా ?

ఉ॥ భోగమాత్రసామ్యలింగాచ్చ॥ అను సూత్రమునకు నిర్గుణముక్తిపక్షమున నర్థము కుదరనందుననే అద్వైతభాష్యకర్తలును దీనిని సగుణపరముగానే యన్వయించియున్నారు. కాబట్టి శ్రు॥ సోఽశ్నుతే అనుముక్తిస్వరూపమును జెప్పువాక్యమును ఉపనిషద్భాష్యమునందు నిర్గుణముక్తిపరముగా పరులు చేసిన యర్థము బ్రహ్మమీమాంసకు విరుద్ధ మగుటయేగాక సూత్రభాష్యమునందు తామే యీవాక్యమును సగుణముక్తిపరముగా నంగీకరించియున్నారుగాన స్వవచనవిరుద్ధంబు నైయున్నది.

ప్ర॥ బ్రహ్మణాసహ = బ్రహ్మముతోఁగూడ అనియర్థము చెప్పుట సర్వాన్కామాన్సహ అనివాక్యమును వేరుచేసి బ్రహ్మణావిపశ్చితేతి అని వేరువాక్యముగాఁ జదువు

నట్టి అధ్యయనసంప్రదాయమునకు విరుద్ధమని అప్పయదీక్షితులవారు చెప్పియున్నారుగదా! ఇఁక నాయర్థ మెట్లు ఉచిత మగును ?

ఉ॥ ఆయాక్షేపము సరియైనదికాదు.

ప్ర॥ అదియేల ?

ఉ॥ అచ్చట వాక్యవిభాగము అక్షరసంఖ్యనుబట్టి యేర్పడినదిగాని అర్థసమాప్తినిబట్టి యేర్పడినది గాదు.

ప్ర॥ అది యెట్లు ?

ఉ॥ ఆయుపనిషత్తులోనివాక్యములు తఱుచుగా ఎనిమిది లేక తొమ్మిదిమాత్రము అక్షరములు గలిగియున్నవి. అట్లుగాక నాయుపనిషత్తులలోనివాక్యవిభాగము అర్థసమాప్తినిబట్టియే యేర్పడియున్నచో అందే శ్రు॥ ఆవహాస్తీవితన్వానా అని త్రెంచిపైచినవాక్యమును కుర్వాణా అనుపైవాక్యమున నన్వయించుట విరుద్ధమే కావలసివచ్చును.

అదిగాక, సూ॥సహాయుక్తేఽప్రధానే అనుపాణినీయసూత్రమునుబట్టి సహ అనుపదంబును దానియోగంబున బ్రహ్మణా అనితృతీయావిభక్తియు నేర్పడియున్నవిగాన నావాక్యమునకు బ్రహ్మముతోగూడ నని సాయుజ్యముక్తిని చెప్పునర్థమే యుక్తముగాని దీనికివిరుద్ధముగా నద్వైతులు చెప్పినయర్థము పాణినీయాదిసకలశాస్త్రవిరుద్ధమని వేదపథమునందు సవిస్తరముగా నిరూపించియున్నాముగాన నందు జూడనగును.

ప్ర॥ శ్రు॥ బ్రహ్మవిద్బ్రహ్మైవ భవతి ఛాం॥ బ్రహ్మవిత్-బ్రహ్మము నెఱిగినవాఁడు-బ్రహ్మైవ-బ్రహ్మమే యగుచున్నాఁడని చెప్పునది శ్రుతి గాదా ?

ఉ॥ ఆవాక్యము శ్రుతియేగాని దానియర్థముమాత్రము నీగ్రహించినది కానేరదు.

ప్ర॥ ఆవాక్యమునకు నర్థ మేమి ?

ఉ॥ ముక్తశ్శివసమో భవేత్॥ ముక్తినొందినవాఁడు శివునితో సమానుఁ డగును శ్రు॥ నిరంజనః పరమం సామ్య ముపైతి॥ ఛాం॥ మోక్షము నొందినవాఁడు బ్రహ్మముతో నత్యంతసమత్వము నొందును ఈమొదలగుశ్రుతివాక్యములు ముక్తునకు బ్రహ్మసారూప్యమును చెప్పుచున్నవిగాన వానితో విరోధము రాకుండుటకై బ్రహ్మైవ అనుచోట నున్న, ఏవ, అనుపదమునకు ఇవపదముతో సమానార్థకత్వ మంగీకరించి, బ్రహ్మవిత్, బ్రహ్మము నుపాసించినవాఁడు, బ్రహ్మైవ, బ్రహ్మముతో సమానుఁడు-భవతి-అగుచున్నాఁ డనుటయే యథార్థము

ప్ర॥ ఏవ అనుపదమునకు ఇవార్థకత్వము ఎందేని(గలదా ?

ఉ॥ శ్రు॥ అన్ధో భవత్యపి రోదితీవ, వినాశమేవాఽపీతో భవతి, అను సుషుప్త విషయశ్రుతియందు ఏవఅనుపదము ఇవార్థకముగానే గ్రహింప(బడియెను మఱియు, శ్రు॥ వైష్ణవం వామన మాలభేత। స విష్ణురేవ భూ త్వేమా న్లోకా నభిజయతి॥ వైష్ణవయాగముచేసినవాఁడు విష్ణువే అయి యీలోకముల జయించు ననుచోట విష్ణుతుల్యుఁడు అని యర్థము గ్రహింప(బడు చున్నది. అట్లే యిందును గ్రహింప నగును.

ప్ర॥ బ్రహ్మైవ భవతి॥ అనుచోట బ్రహ్మమే యగునని యర్థముగ్రహించినచో బాధ యేమి ?

ఉ॥ బ్రహ్మముతో సమానరూపత్వము వచ్చు ననునితరశ్రుతివాక్యములు విరోధించుటయే బాధ.

ప్ర॥ ఇతరవాక్యములు విరోధించిన నేమి ?

ఉ॥ శ్రుతివాక్యములకు పరస్పరవిరోధము సంభవించెనేని పరస్పరవిరోధమువలన నావాక్యములు నిశ్చిత మగునేయర్థమును దెలుపలేమిచే నిరర్థకములే యగును గాన ప్రమాణములే కాకపోవును,

ప్ర॥ వాక్యములకు పర్పరవిరోధ ముండినందున నవి ప్రమాణము లేల కాకపోవును?

ఉ॥ పొమ్ము - పోవలదు - అని చెప్పునెడ పరస్పర విరోధముచే నీవాక్యములు నిరర్థకములైనట్లే ఒకదాని కింకొకటి విరోధించునేని శ్రుతివాక్యములును నిరర్థకములే కావలసివచ్చునుగదా ?

ప్ర॥ సారూప్యమును చెప్పువాక్యములు సగుణముక్తిపరములును బ్రహ్మమే యగు నని చెప్పువాక్యములు నిర్గుణముక్తిపరములు నని విభాగించి యన్వయించునెడ నావాక్యములకు పరస్పరవిరోధము రాదుగదా ?

ఉ॥ సగుణబ్రహ్మమేగాని నిర్గుణబ్రహ్మ మున్నదనునది వేదములలో నెందును లేదని బ్రహ్మస్వరూపనిర్ణయమున సిద్ధాన్తము చేయబడియున్నదిగాన నిర్గుణ ముక్తి యున్నదనుమాట కల్లయేగాన శ్రుతివాక్యమును నిర్గుణముక్తివిషయముగా నన్వయించుట యుక్తము గాదు.

మఱియు - సగుణముక్తిపక్షమునందు నన్నివాక్యములును నిర్బాధముగా నన్వయించుచున్నవి. ఇఁక నిర్గుణముక్తిపక్షమునందైననో అనేకవాక్యములు కుద

ప్ర॥ శ్రు॥ త మేవం విదిత్వాఽతిమృత్యు మేతి। నాన్యః పన్థా అయనాయ విద్యతే॥ తైత్తి॥ పరంబ్రహ్మము నెఱింగినవాఁడు ముక్తిని పొందును. ముక్తినొంద నింకొకమార్గము లేదు. జ్ఞానాదేవతు కైవల్యం। కైవల్యము జ్ఞానమువలననే లభించును. ఈమొదలగుశ్రుతిస్మృతులు జ్ఞాన మొక్కటే ముక్తికి సాధన మని చెప్పుచున్నవి. జ్ఞానమునకు నజ్ఞానమును పోగొట్టుటే స్వభావము. దీనింబట్టి బంధము అజ్ఞానమే యని యేర్పడుచున్నది. కావున నేను బ్రహ్మము గా నను నజ్ఞానమును తొలఁగించునట్టి (నేను బ్రహ్మనే యను ప్రత్యక్షాను భవముచేత నేనుబ్రహ్మముగానను నజ్ఞానము తొలఁగిపోవఁగా) జీవునకు బ్రహ్మ రూప మగుముక్తి సిద్ధించుగాన జీవబ్రహ్మైక్యరూప మైనదే మోక్షస్వరూప మని యేల గ్రహింపఁగూడదు ?

ఉ॥ వేదాన్తములయందు మోక్షసాధనముగా విధింపబడిన జ్ఞానము ఉపాసనా రూపమే యనియు, భక్తిలోనే చేరుననియు, సాధనస్వరూపనిర్ణయమునందు నిరూపింపఁబడియెగాన ననుభవరూపము గానేరదు. శ్రు॥ ధ్యాననిర్మథనా భ్యాసా త్పాశం దహతి పండితః. జ్ఞాత్వా దేవం సర్వపాశాపహానిః॥ శ్వేతా॥ ఈమొదలగు శ్రుతులు బంధము పాశరూపమని చెప్పుచున్నవిగాన నజ్ఞాన రూపము కానేరదని యేర్పడుచున్నది. ఉపాసనము-భక్తియు-పరమేశ్వరుని సారూప్య సాయుజ్యములకు సాధనములగును.

దీనింబట్టి సారూప్యము - సాయుజ్యము - ననునదియే ముక్తిస్వరూపముగాని జీవబ్రహ్మైక్యరూపము గానేర దని స్పష్ట మగుచున్నది.

ప్ర॥ శ్రు॥ అహం బ్రహ్మాఽస్మి॥బృ॥౧॥౪॥౧౦॥ అహం-నేను-బ్రహ్మ-బ్రహ్మము అస్మి-అగుదుననుశ్రుతిచే జీవుఁడే బ్రహ్మయని యేర్పడుట లేదా ?

ఉ॥ ఈశ్రుతి ఉపనిషత్తులలో రెండుచోట్ల నున్నది. అందు నొక్కచో శ్రు॥ తదా త్మాన మేవాఽవైత్ అహంబ్రహ్మాస్మీతి॥ అహం - నేను బ్రహ్మ - బ్రహ్మ మును, అస్మి-అగుదునని-తద్-ఆబ్రహ్మము-ఆత్మానం-తనను-అవైత్ - తెలిసి కొనెను. అని యున్నది. ఇట్లు బ్రహ్మము తాను బ్రహ్మమునని తలచిన దానింబట్టి జీవుఁడు బ్రహ్మమని యేర్పడుట యసంభవము.

ఇఁక రెండవచోట ఉపాసనాప్రకరణముగాన దానింబట్టి నేను బ్రహ్మమునని యభేదముగా నుపాసన చేయవలయుననియే యేర్పడునుగాని జీవుఁడే బ్రహ్మమని యేర్పడదు.

ప్ర॥ బ్రహ్మముకన్న వేఱుగా నున్నజీవుఁడు తానే బ్రహ్మమునని యేల భావింపవలయు ?

ఉ॥ ముక్తిదశయందు తనకు బ్రహ్మతో సమానమైనరూపము రావలయుగాన దానికై యట్లు భావింపవలయు.

ప్ర॥ నేను బ్రహ్మమునని భావింపఁగా జీవునకు బ్రహ్మముతో సమానమైనరూపమెట్లు వచ్చును ?

ఉ॥ భ్రమరకీటన్యాయముచే వచ్చును.

ప్ర॥ ఆన్యాయమున కర్థమేమి ?

ఉ॥ కీటము తాను భ్రమరమునని భావింపఁగా దానికి భ్రమరముతో సమానమైన రూపము వచ్చెనని యర్థము.

ప్ర॥ పరమేశ్వరుఁడు వేఱే యగునెడ జీవుఁడు తానే బ్రహ్మమునని భావించుటవలన నేమి ప్రయోజనము ?

ఉ॥ నేనే గరుత్మంతుఁడనని భావించు గరుడమంత్రోపాసకుని గరుత్మంతుఁడు విషసంహరణసామర్థ్యమునొసగి యనుగ్రహించువిధమున తెంపులేకుండ చిరకాలము నేను బ్రహ్మమునని కావించునభేదభావనాసంబంధమువలన సాధకునకు పరమేశ్వరుఁడు పశుత్వనివృత్తిరూప మగుఫలమునొసఁగి తనతో సమానమైనరూపము ననుగ్రహించును గాన నది ప్రయోజనము.

ప్ర॥ జీవబ్రహ్మలకు భేదమే వాస్తవ మగునెడ నేనే బ్రహ్మమునని యభేదముగా భావించుట భ్రమమే యగు. అది యెట్లు ముక్తికి హేతు వగును ?

ఉ॥ కీటమునకు కీటత్వము పోయి భ్రమరత్వము వచ్చుట తానే భ్రమరమునని భావించుటవల్లనే సంభవించుచున్నది. అట్లే జీవునకు పశుత్వము పోయి శివసమానరూపత్వము వచ్చుట నేనే శివుఁడనని భావించుటవల్లనే సంభవించునుగాన నిట్లు ముక్తిసిద్ధికై యభేదభావము ఉపాసనావిషయముననే వేదాన్తములయందు జెప్పఁబడియెగాన నది యథార్థమైనది కాదని తెలియుచున్నది.

ప్ర॥ శ్రు॥ తత్త్వమసి॥ ఛాం॥ నీవా బ్రహ్మమే యగుదువని ఛాందోగ్యోపనిషత్తు తొమ్మిదిమాఱు లుపదేశించినది. దీనింబట్టి జీవుఁడే బ్రహ్మమయి యుండఁగా జీవుఁడు బ్రహ్మసారూప్యము నొంది బ్రహ్మముతోఁగూడి యుండుట యను సాయుజ్యము నొందుట యెట్లు ?

ఉ॥ త త్త్వమసి॥ అనువాక్యమునకు నీ వా బ్రహ్మమే యంతరాత్మగాఁ గలవాఁడ వని యర్థమేగాక నీవే బ్రహ్మమని యర్థము సరియైనది గానేరదు.

ప్ర॥ ఆవాక్యమున కిట్టియర్థ మెట్లు వచ్చినది ?

ఉ॥ శ్రు॥ ఐతదాత్మ్య మిదగ్ం సర్వమ్॥ ఛాం॥ సమస్తప్రపంచమునకు నాబ్రహ్మమే యంతరాత్మ యని మొదట సామాన్యముగా జేసిన ప్రతిజ్ఞను శ్రు॥ త త్త్వ మసి॥ నీకును నాబ్రహ్మమే యంతరాత్మయని విశేషవచనముచే సమర్థించుట వలన నావాక్యమున కాయర్థమే సమంజస మయ్యెను.

ప్ర॥ తొమ్మిదిమాఱు లుపదేశించినవాక్యములలో నొక్కదానియందైన నీవాబ్రహ్మ మను నర్థము లేదా ?

ఉ॥ లేనే లేదు.

ప్ర॥ త త్త్వమసి యను వాక్యమునకు నభేదరూప మగునర్థము లేదని దేనింబట్టి తెలియుచున్నది ?

ఉ॥ తొమ్మిదిమాఱులును దృష్టాన్తవాక్యములలోనను దార్ష్టాన్తికవాక్యములలోనను భేదమే స్పష్టముగా దెలియుచున్నదిగాన నావాక్యమునకు నభేదరూపార్థము లేనేలేదని విస్పష్ట మగుచున్నది.

ప్ర॥ శ్రు॥ త త్త్వమసి॥ వాక్యమునకు త్వమ్-నీవు-తత్-ఆబ్రహ్మమవు-అసి-అగుదువు-అను నర్థము సరిగా నున్నదిగాని నీ వాబ్రహ్మము ఆత్మగాఁ గలవాడ వను నర్థ మెట్లు సరిగానున్నది ?

ఉ॥ ఉపక్రమమునుబట్టి రెండవయర్థమే సరి యగును.

ప్ర॥ ఎట్లు

ఉ॥ శ్రు॥ ఐతదాత్మ్య మిదగ్ం సర్వమ్-స ఆత్మా॥ఛాం॥ ఇదమ్-ఈ-సర్వమ్-సమస్త ప్రపంచము, ఐతదాత్మ్యమ్-ఈబ్రహ్మమే ఆత్మగాఁగలది॥ సః-ఆబ్రహ్మమే ఆత్మా-సకలమునకు అంతరాత్మ॥

ఈ పూర్వవాక్యమునుబట్టి త్వమ్-నీవు-తత్-ఆబ్రహ్మమే ఆత్మగాఁగలవాఁడ వను నర్థమే సమంజసమని యేర్పడుచున్నది.

ప్ర॥ ఈరెండర్థములలో నేది శ్రుత్యన్తరములకు నవిరుద్ధముగా నున్నది ?

ఉ॥ రెండవ యర్థమే.

ప్ర॥ అది యెట్లు ?

ఉ॥ అన్తర్యామిబ్రాహ్మణమునందు శ్రు॥ యస్య పృధివీ శరీరం॥ బృ॥ ఏబ్రహ్మము నకు-పృధివీ-భూమి - శరీరమ్ - దేహమోఅని యారంభించి-యస్య విజ్ఞానం శరీరమ్॥ యస్య-ఏబ్రహ్మమునకు-విజ్ఞానమ్-జీవుఁడు,శరీరమ్-దేహమ్ - అని యిట్లు సర్వమునకు బ్రహ్మమే యంతరాత్మ యని నిర్ణయింపఁబడియున్నది.

మఱియు-శ్రు॥ సోఽన్తరా దన్తరం సంప్రావిశత్॥ అధర్వ॥ సః-అపరమే శ్వరుఁడు-అన్తరాత్-లోననుండునట్టి + జీవునియొక్కయు-అన్తరం-లోన-సంప్రా విశత్-ప్రవేశించెను। శ్రు॥ అన్తః ప్రవిష్ట శ్శాస్తా జనానాం॥ జనానామ్-జీవులకు-శాస్తా-నియామకుఁడైన యీశ్వరుఁడు-అన్తః-జీవులలోపల - ప్రవిష్టః - ప్రవేశించి యున్నవాఁడు॥ అని యిట్టు లనేకశ్రుతులు జీవునకు నంతరాత్మ పరమేశ్వరుఁ డని చెప్పుచున్నవి.

ప్ర॥ ఆశ్రుతు లన్నియు నట్లే చెప్పుగాక। తత్త్వమసి మొదలగు వాక్యములు జీవుఁడే బ్రహ్మ మని చెప్పుచున్నవిగదా ?

ఉ॥ అన్నిశ్రుతులకు విరోధము రాకుండునట్లు గ్రహింపఁబడునదే వేదార్థము.

ప్ర॥ ఎట్లు చెప్పునెడ నన్నిశ్రుతులకు విరోధము రాకుండును ?

ఉ॥ ఆబ్రహ్మము నీకు నంతకు నంతరాత్మ యని చెప్పునప్పుడే

ప్ర॥ నీవే యాబ్రహ్మమ వని చెప్పునెడ నేమి విరోధము ?

ఉ॥ పరమేశ్వరుఁడు జీవునకు నంతరాత్మయని యనేకశ్రుతులు చెప్పుచున్నవిగాన నవి యన్నియు జీవుఁడే బ్రహ్మమని చెప్పునెడ విరోధించునుగాన నాయర్థము సరియైనది కానేరదు.

ప్ర॥ శ్రు॥ తత్త్వమసి॥ అనువాక్యము "దశమ స్త్వమసి" పదియవవాఁడవు నీవే యనుమాటతో సమానముగా నున్నది. కావున- పదుగురుచేరి యేఱుదాటిన తరువాత, వారిలో నొక్కఁడు కడమవారినిమాత్రమే లెక్కఁబెట్టి మనలోఁ బదియవవాఁడు యేటిలోఁ గొట్టుకొని పోయెనని శోకించునప్పుడు వారిలో వేఱొక్కఁడు నిన్ను మఱచితివిగాన నీవే పదియవవాఁడవని చెప్పఁగా నాతని శోకము తొలఁగునట్లు నిన్ను నీవు మఱచితివి నీవే బ్రహ్మ మగుదువని గురువు ఉపదేశింపఁగా వానికి శ్రు॥అహంబ్రహ్మాస్మి॥ నేనే బ్రహ్మము నగుదు నని ప్రత్యక్షానుభవముగలుగుఁగాన దీనింబట్టి యిట్లు జీవబ్రహ్మైక్యరూప మగు ముక్తి సిద్ధించుట లేదా?

ఉ॥ తత్త్వమసి అనువాక్యము దశమ స్త్వమసి అనుదానితో సమానముగా నున్న దనుకొనుట భ్రాన్తియేగాని నిజము గానేరదు.

ప్ర॥ ఎందువలన ?

ఉ॥ తత్త్వమసి అను వాక్యము "దశమ స్త్వమసి అను వాక్యమును బోలినదే యగునేని ఛాందోగ్యోపనిషత్తునందు తత్త్వమసి అని యుపదేశించినతొమ్మిది వాక్యములలో నొక్కచోనైన దశమవివేకానుసంధానము దృష్టాన్తముగా దెలుపఁబడి యుండెడిది. అది తెలుపఁబడి యుండదయ్యెను, ఉపనిషత్తునకు జీవబ్రహ్మైక్యమునందు తాత్పర్యము గలిగి యున్నచో అద్వైతవాదులు చెప్పునట్టి దశమవివేకముగాని విస్మృతకంఠాభరణముగాని వ్యాధకులసంవర్ధిత రాజకుమారవిషయముగాని మెడలోనిసొమ్ము మఱచిన విషయముగాని, బోయెలుపెనిచిన రాజకుమారుని విషయముగాని దృష్టాన్తముగా నొక్క మాత్రైన నేలచెప్పకుండును? అట్లుచెప్పకుంట శ్రుతికిఁ దోషమినా? ప్రజలమీద దయలేమినా? అద్వైతులకు గలప్రజ్ఞావిశేషంబును లోకానుగ్రహబుద్ధియు శ్రుతికి లేదనుటవిశ్వాసార్హ మగునా ? కాదు. అట్లు గాదేని యాశ్రుతి తొమ్మిదిమాఱులును జీవేశ్వరులకు భేదమునే విశదము చేయునట్టి పక్షి, శకునిఘాతకుఁడు మొదలైన దృష్టాన్తములనే యేల యుపదేశించును ? దీనింబట్టి తత్త్వమసి అను వాక్యమునకు నీవాపరబ్రహ్మమే యంతరాత్మగాఁ గలవాఁడ వనునర్థమునందే గాక నీవాబ్రహ్మమను నర్థమునం దెంతమాత్రంబును తాత్పర్యములేదని బ్రహ్మపథములోని వేదపథమునందు ఛాందోగ్యవిచారమునందును జీవస్వరూపనిర్ణయమునందును నధికముగాఁ దెలిపియుంటిమి. కాఁబట్టి జీవబ్రహ్మైక్యము ముక్తిస్వరూపము గానేరదు.

మఱియు పదియవవాఁడవు నీవనునుపదేశముగాని మెడలోనియాభరణము మఱచుటగాని, వ్యాధులచే పెనుపఁబడిన రాజకుమారుఁడు వ్యాధుఁడనేయని తలఁచుటగాని యజ్ఞానులగు జనులయందు సంభవించుగాని ప్రజ్ఞానఘనమైనబ్రహ్మమునందు సంభవింపనేరదుగాన నీ వాబ్రహ్మ మనునుపదేశంబును నెంతమాత్రము యుక్తము గానేరదు.

ప్ర॥ శ్రు॥ "స్వేన రూపేణాఽభినిష్పద్యతే॥ ఛాం॥౮-౨॥౩ ముక్తిదశయందు జీవుఁడు తనరూపమునే పొందునని శ్రుతి చెప్పుచున్నది గాదా ? దీనింబట్టి క్రొత్తరూపము రానేరదని తెలియుట లేదా ? బ్రహ్మముయొక్క సారూప్యము నొందు

వెలువడుటగాని యేదియు నంగీకరింపఁబడియుండలేదు గాన నీశ్రుతి యంతయు నిరర్థకమే యాయెను॥

ప్ర॥ శ్రు॥ అస్మాచ్ఛరీరాత్సముత్థాయ - ఈ శరీరమునుండి లేచి యనగా - ఆత్మానాత్మవివేకముచేత శరీరమే నేనను నభిమానమును వదలిపెట్టి, పరం జ్యోతి రుపసంపద్య - తానే పరబ్రహ్మ ననుభావమును పొందియని యర్థము. ఇఁకనీశ్రుతి యేల సార్థకము గాలేదు?

ఉ॥ జీవుఁడు ఆత్మానాత్మవివేకముచేత నేను శరీరాదులు కానని నిశ్చయించుకొనిన తరువాత నేమి యయ్యెను? బ్రహ్మమే యాయె ననియొప్పితీరవలయుగదా? అట్లేని తిరుగా, శ్రు॥ పరంజ్యోతి రుపసంపద్య, పరమేశ్వరు నొంది యని దేనికి? మఱియు, స్వేన రూపేణాఽభినిష్పద్యతే, అనియు దేనికి? కాఁబట్టి యద్వైతవాదమునందు ఈ శ్రుతిలోనివాక్యము లన్నియు నిరర్థకములే యనుట నిజము.

ప్ర॥ ముక్తినొందువాఁడు శరీరమునుండి యుత్క్రాన్తినొందునని యెచట నున్నది?

ఉ॥ శ్రు॥శతం చైకాచ హృదయస్య నాడ్యః । తాసాం మూర్ధాన మభినిస్సృతైకా। తయోర్ధ్వ మాయ న్నమృతత్వ మేతి విష్వఙ్ఙన్యా ఉత్క్రమణే భవన్తి॥ నూటయొక్కనాడులు హృదయము నాశ్రయించి యున్నవి. వానిలో నొక్కటి శిరమున బ్రహ్మరంధ్రము నొంది యున్నది. ఆనాడీద్వారమునుండి యుత్క్రాన్తి నొందుదురు, అనుటచే ఇట్లు ముక్తినొందువాఁడు బ్రహ్మనాడి నుండి యుత్క్రాన్తి నొందునని శ్రుతియందు గలదు.

ప్ర॥ ఆబ్రహ్మనాడినుండి యుత్క్రాన్తి నొందుట యెట్లు సంభవించును?

ఉ॥ సూ॥తదోకోఽగ్రజ్వలనం॥ అను బ్రహ్మసూత్రమునందు - తత్ప్రకాశితద్వారా హార్దానుగృహీత శ్శతాధికయా॥ భాం॥ ౪॥ ౨॥ ౨॥ ఉపాసనచే సుప్రసన్నుఁడగుపరమేశ్వరునివలన నూటయొక్కటవనాడీద్వారము ప్రకాశించు ననియు నాద్వారముతో నుపాసకుఁడు వెలువడి ముక్తి గాంచుననియుఁ గలదు గాన పరమేశ్వరుననుగ్రహముపలననే సంభవించును.

ప్ర॥ మలావరణము తొలఁగినతరువాతనే జీవునకు నిజరూపము వ్యక్తమగు నని యెందున్నది?

ఉ॥ శ్రు॥నిరంజనః పరమం సామ్య ముపైతి॥ ఛాం॥ అను శ్రుతియందు అంజన మను మలావరణము నివర్తింపఁగానే పరమేశ్వరునిరూపముతో సమాన మగు రూపము ప్రాప్తించునని యున్నది.

మఱియు శ్రు॥ బ్రహ్మవి దాప్నోతి పరమ్॥ తైత్తి॥ బ్రహ్మవిత్ - బ్రహ్మో పాసకుఁడు - పరమ్ - పరమేశ్వరుని - ఆప్నోతి - పొందుచున్నాఁడు. అను శ్రుతియు అభేదవాదమునందు సరిగా నన్వయింపదు.

ప్ర॥ ఎందువలన ?

ఉ॥ ఆపక్షమునందు జీవుఁడే బ్రహ్మముగాన జీవుఁడు బ్రహ్మమును పొందె ననుట విరుద్ధము గావున-

ప్ర॥ బృహదారణ్యోపనిషత్తునందు శ్రు॥ అసతో మా స ద్గమయ। తమసో మా జ్యోతి ర్గమయ। మృత్యో ర్మాఽమృతం గమయ॥ నన్ను నసత్యమునుండి సత్యము నొందింపుము। నన్నుఁ జీకటినుండి వెలుతురు నొందింపుము. నన్ను మృత్యువునుండి యమృతము నొందింపుము. అను వాక్యములను జెప్పినతరువాత, శ్రు॥స యదాహాఽసతో మా స ద్గమయేతి।మృత్యుర్వా అసత్ స దమృతమ్। మృత్యో ర్మాఽమృతం గమయాఽమృత మ్మా కుర్విత్యే వైత దాహ॥ అసత్యమునుండి సత్యము నొందింపు మనుచోట। అసత్యమనగా మృత్యువు। సత్య మనగా అమృతము। నన్ను మృత్యువునుండి అమృతము నొందింపు మనగా నన్ను అమృతముగాఁ జేయుమని యర్థమని వ్యాఖ్యానము చేయఁబడియున్నది. నన్ను బ్రహ్మమును పొందింపు మని చెప్పినవాక్య మును నన్ను బ్రహ్మముగా జేయుమని యర్థమని చెప్పి శ్రుతియే వివరించిన దానింబట్టి బ్రహ్మను పొందుట అను భేదపరవాక్యములకు బ్రహ్మమే అగుట అని యభేదమే అర్థమని యేర్పడుచున్నది. ఇఁక బ్రహ్మమును పొందె ననుట విరుద్ధము గా దని తేలలేదా ?

ఉ॥ ఇంతమాత్రమున భేదపరవాక్యములకు నభేదమే యర్థమని యేర్పడనేరదు.

ప్ర॥ నన్ను బ్రహ్మమును పొందింపు మనగా బ్రహ్మముగానే చేయు మని యర్థమని నిర్ణయించిన బృహదారణ్యశ్రుతిగతి యేమి ?

ఉ॥ ఆశ్రుతియందు నన్ను బ్రహ్మముగాఁ జేయుమన్నదానికి బ్రహ్మసమానునిగాఁ జేయుమనియే యర్థముగావున ఆశ్రుతి సార్థకమే యగుచున్నది.

ప్ర॥ నన్ను బ్రహ్మమును పొందింపు మనఁగా బ్రహ్మముగానే చేయుమని శ్రుతియందున్నదానికి బ్రహ్మసమానునిఁగా జేయుమని నీచెప్పినయర్థము విరుద్ధము గాదా ?

ఉ॥ విరుద్ధము గానేరదు.

ప్ర॥ నన్ను బ్రహ్మముగా జేయు మనుమాట అభేదపరముగా నున్నది కాదా ?

ఉ॥ అగును.

ప్ర॥ నన్ను బ్రహ్మసమానునిగా జేయుమని నీచెప్పినయర్థము భేదపరము కాదా ?

ఉ॥ అగును.

ప్ర॥ ఇఁక నాశ్రుతికి నీచెప్పినయర్థము విరుద్ధ మెట్లు కాదు ?

ఉ॥ ఆవాక్యము అభేదముగా నున్నట్లు కనఁబడినను దానికి ననేకములైన శ్రుత్యన్తరములనుబట్టి భేదపర మైనయర్థము విరుద్ధము గానేరదు.

ప్ర॥ బ్రహ్మమును పొందు నని భేదమును జెప్పువాక్యములకు బ్రహ్మమే యగునని యభేదరూపార్థమును గ్రహించునెడ బాధయేమి ?

ఉ॥ ముక్తినొందువాఁడు పరమేశ్వరునిపొంది ఆయనసారూప్యమును జెంది యాయనతోఁగూడి యుండునని యనేకశ్రుతివచనములు పరమేశ్వరప్రాప్తిని పరమేశ్వరసారూప్యమును పరమేశ్వరసాయుజ్యమును తెలుపుచున్నవి. ముఖ్యమగుపొందునను నర్థముగలవానికి లక్షణచే బ్రహ్మమే యగునను నర్థము గ్రహించుటచే లక్షణ దోషముగాదా? ఇదిగాక - అనేకశ్రుతివాక్యములు ముక్తిదశయందు జీవుఁడు పరమేశ్వరుని పొందుచున్నాఁడనియు. తరువాత సమానరూపత్వమును సాయుజ్యమునుగూడ పొందుచున్నాఁడనియు చెప్పుచున్నవి. బ్రహ్మమును పొందుచున్నాఁడనువానికి బ్రహ్మమే యగుచున్నాఁడని యర్థము గ్రహించునెడ సారూప్యమును సాయుజ్యమును జెప్పువాని కేమి యర్థము గ్రహింపవలయును.

ప్ర॥ వానికిని బ్రహ్మమే యగునను నర్థమునే గ్రహించిననేమి?

ఉ॥ అనేకశ్రుతివాక్యములకు ముఖ్యార్థమును త్యాగముచేయుటకన్న మహాదోషమేమి యుండును.

ప్ర॥ శ్రుతులు ముక్తిస్వరూపము నెట్లుచెప్పినవి?

ఉ॥ శ్రు॥ బ్రహ్మవి దాప్నోతి పరమ్ - తైత్తి॥ ఉపాసకుడు పరమేశ్వరుని పొందుచున్నాఁడు॥పరంజ్యోతిరుపసంపద్య॥ఛాం॥పరమేశ్వరునిపొంది।బ్రహ్మోఽప్యేతి-

బ్రహ్మమును పొందుచున్నాఁడు॥ పరాత్పరం పురుష ముపైతి॥ఛాం॥ పరమ పురుషుని పొందుచున్నాఁడు. అత్ర బ్రహ్మ సమశ్నుతే॥ ఛాం॥ బ్రహ్మమును పొందుచున్నాఁడు॥ మునిర్గచ్ఛతి భూతయోనిం-శివుని పొందుచున్నాఁడు। మృత్యోర్మాఽమృతం గమయ-బృ॥ నన్ను పరమేశ్వరుని పొందింపుము॥ య మే వైషవృణుతే తేన లభ్యః॥కఠ॥ పరమేశ్వరుఁడు ప్రేమించినవాఁడే పరమేశ్వరుని పొందును॥ అని యిట్లు నూర్లకొలది వాక్యములు ముక్తుఁడు పరమేశ్వరుని పొందునని చెప్పుచున్నవి. మఱియు-శ్రు॥ పరమం సామ్య ముపైతి-పరమం - అత్యన్తమైన-సామ్యమ్ - సమానరూపత్వమును-ఉపైతి - పొందుచున్నాఁడు. శ్రు॥సోఽశ్నుతే సర్వా న్కామా న్సహ బ్రహ్మణా।సః-అధికారి-బ్రహ్మణాసహ-పరమేశ్వరునితోఁగూడ। సర్వాన్-సకలమైన-కామాన్ - భోగములను-అశ్నుతే-అనుభవించుచున్నాఁడు-అని యిట్లు-పెక్కువాక్యములు సాధకుఁడు బ్రహ్మమును పొందుచున్నాఁడనియు సారూప్యమును పొందుచున్నాఁడనియు సాయుజ్యమును పొందుచున్నాఁడనియు దెలుపుచున్నవి. దీనింబట్టి మోక్షాధికారి మొదట పరమేశ్వరునిసన్నిధికిఁజేరి పరమేశ్వరసమానరూపత్వము నొంది పరమేశ్వరునితోఁగూడి సకలభోగముల ననుభవించుచుండునని మహావాక్యార్థ మేర్పడుచున్నది. బ్రహ్మను పొందుటగాని - సమానరూపత్వముగాని-సాయుజ్యము(కూడియుండుట)గాని భేదమునందేగాక యభేదమునందు కుదరమిచే ఇట్లు ముక్తిస్వరూపమును జెప్పువాక్యములవలన ముక్తిదశయందు జీవేశ్వరులకు భేదమే యున్నట్లు స్పష్టమగుచున్నది.

ప్ర॥ భేదమునే చెప్పునీవాక్యములకు బృహదారణ్యావాక్యమువలన నభేదపర మగు నర్థము నేల గ్రహింపరాదు ?

ఉ॥ అన్యాయముగాన గ్రహింపరాదు.

ప్ర॥ అది యన్యాయమెట్లు ?

ఉ॥ సూ॥విప్రతిషేధే భూయసాం స్యా త్స్వధర్మత్వమ్।పరస్పరవిరోధము గలిగినప్పుడు ఎక్కువసంఖ్య గల వాక్యములకే ప్రాబల్యము గాన వాని కనుకూలముగానే తక్కువసంఖ్యగలవాక్యముల నన్వయింపవలయునని జైమినీయన్యాయము నిర్ణయించినది. బృహదారణ్యములోనియొక్కవాక్యమునుబట్టి బ్రహ్మమును పొందుచున్నాఁ డనిచెప్పు ననేకవాక్యములకు నభేదపరముగా నర్థము గ్రహించుట యాన్యాయమునకు విరుద్ధము.

ప్ర॥ అటులేని బృహదారణ్యవాక్యమున కేమియర్థము గ్రహింపవలయు ?

ఉ॥ బ్రహ్మమును పొందుచున్నాఁ డనిచెప్పు భేదపరము లైన యితరవాక్యములతో విరోధము రాకుండుటకై బృహదారణ్యవాక్యమునకే భేదపర మగునర్థము గ్రహించుట న్యాయము.

ప్ర॥ శ్రు॥అమృత మ్మా కుర్వి త్యేవై త దాహ।మా - నన్ను-అమృతమ్-బ్రహ్మము నుగా-కురు-చేయు మనుదానికి భేదపరముగా నర్థమేమి యగును ?

ఉ॥ మా - నన్ను - అమృతం - బ్రహ్మసదృశునిగా - కురు - చేయు మని యర్థ మగును.

ప్ర॥ నన్ను బ్రహ్మముగా జేయుమని యొకయర్థము నన్ను బ్రహ్మసదృశునిగాఁ జేయుమని వేఱొకయర్థము ఈరెంటిలో నేయర్థము వాక్యాన్తరములకు సను గతముగా నున్నది?

ఉ॥ నన్ను బ్రహ్మసదృశునిఁగా జేయుమనునర్థమే యితరవాక్యములకు సను గతముగా నున్నది.

ప్ర॥ ఎందువలన ?

ఉ॥ ముక్తిప్రకరణములోని వాక్యములలోఁ గొన్ని బ్రహ్మప్రాప్తిని - మఱిగొన్ని బ్రహ్మసాదృశ్యమును - ఇంకఁగొన్ని సాయుజ్యమును జెప్పుచున్నవి. నన్ను బ్రహ్మసదృశునిగా జేయుమనుటయే యావాక్యముల కన్నిటికి నవిరుద్ధముగా న నది యే యథార్థము.

ప్ర॥ ఇట్లు మోక్షము పరమేశ్వరునితో సమాన మగురూపముగలిగి పరమేశ్వరు నితోఁ గూడి సకలభోగముల ననుభవించుటవలన పరమేశ్వర సారూప్య సాయుజ్యరూపమే యయి యుండునెడ శ్రు॥ తమేవం విదిత్వాఽతిమృత్యు మేతి నాఽన్యఃపన్థా అయనాయ విద్యతే॥ తం - ఆపరమేశ్వరుని - ఏవం - ఇట్లు - విదిత్వా - తెలిసికొని - అతిమృత్యుం - మోక్షమును - ఏతి-పొందు చున్నాఁడు - అయనాయ - మోక్షముకొఱకు - అన్యః - ఇంకొక - పన్థాః - మార్గము - న - లేదు॥ జ్ఞానాదేవతు కైవల్యమ్॥ కైవల్యమ్ - మోక్షము - జ్ఞానాదేవతు - జ్ఞానమువల్లనేగాని వేఱొకమార్గమున దొరకదు. అని, యీ మొదలైన శ్రుతిస్మృతులవలన మోక్షము ఆత్మజ్ఞానమువల్లనే గలుగునని తెలియుచున్నది. అదియెట్లు సంగతమగును ? ఏ లనగా ఆత్మజ్ఞాన-మనగా

స్వస్వరూపజ్ఞానమే గాన దీనిచేత తనకన్న నితరుఁడైన ఈశ్వరుని సారూప్య సాయుజ్యములు వచ్చుట అసంభవము గదా?

ఉ॥ వేదాన్తములయందు ముక్తికి సాధనముగాఁ జెప్పఁబడినజ్ఞానము ఉపాసనా రూపమే యని సాధనస్వరూపనిర్ణయమునందు నిరూపింపఁబడియెగాన నీశ్వరోపాసనచేత నీశ్వరునిసారూప్యసాయుజ్యములు లభించుట యుక్తమే గాన ముక్తి సారూప్యసాయుజ్యరూప మనుట సమంజసమే యగును.

ప్ర॥ శ్రు॥ త మేవం విదిత్వాఽతిమృత్యు మేతి॥ తైత్తి॥తమ్-ఆబ్రహ్మమును-ఏవమ్-తననుగానే - విదిత్వా - తెలిసికొని - అతిమృత్యుం - మోక్షమును - ఏతి - పొందుచున్నాఁడు. అనుటచే జీవబ్రహ్మైక్య జ్ఞానమే ముక్తికి సాధనమని తెలియుట లేదా?

ఉ॥ ఏవమ్ - తననుగానే యనుట యపార్థముగాన జీవబ్రహ్మైక్యజ్ఞానము ముక్తికి సాధన మనుకొనుట భ్రమమే యగును.

ప్ర॥ ఏవమ్ - తననుగానే యనుట యపార్థమెట్లగు?

ఉ॥ బహుశ్రుతులకు విరుద్ధముగావున.

ప్ర॥ ఏశ్రుతులకు విరుద్ధము?

ఉ॥ శ్రు॥ జుష్టం యదా పశ్య త్యన్య మీశ మస్య మహిమానమితి వీతశోకః॥ శ్వేతా॥ యదా - ఎప్పుడు - జుష్టమ్ - తనయెడప్రేమగలవాఁడును - అన్యమ్ - తనకన్న నితరుఁడునగు - ఈశమ్- పరమేశ్వరుని - పశ్యతి - చూచుచున్నాఁడో-తదా - అప్పుడు - వీతశోకః-దుఃఖరహితుఁడై - అస్య - ఈపరమేశ్వరుని యొక్క-మహిమానం - సారూప్యమును - ఇతి- పొందుచున్నాఁడు-అనియు-శ్రు॥పృథగాత్మాన ప్రేరితారఞ్చ మత్వా జుష్ట స్తత స్తేనాఽమృతత్వ మేతి॥కఠ॥ ఆత్మానం - తనను - ప్రేరితారమ్ - పరమేశ్వరుని - పృథక్ - వేఱుగా, మత్వా - తెలిసికొని - తతః - తరువాత - తేన-ఆపరమేశ్వరునిచేత - జుష్టః-అనుగ్రహింపఁబడినవాఁడై - తేన- ఆపరమేశ్వరానుగ్రహముచేత - అమృతత్వమ్ - మోక్షమును - ఏతి-పొందుచున్నాఁడు - అనియు, చెప్పుచున్నవి. దీనింబట్టి పరమేశ్వరుఁడు తనకన్న వేఱుగా నున్నాఁడని తెలిసికొని యుపాసన చేయఁగా నద్దేవునియనుగ్రహముచేతనే ముక్తి లభించునని తెలియుచున్నది. ఇట్లు జీవేశ్వరభేదజ్ఞానమే ముక్తికి కారణమని యనేకశ్రుతులు చెప్పుచుండఁగా జీవబ్రహ్మైక్యజ్ఞానమే ముక్తిహేతువనుట బహుశ్రుతివిరుద్ధ మని స్పష్టము.

ప్ర॥ శ్రు॥యత్ర నాన్య త్పశ్యతి॥ఛాం॥ బ్రహ్మమునందు నైక్యము నొందినవాఁడు ఇతరమును జూడఁడు. అనువాక్యమునుబట్టి ముక్తిదశయందు భేదము లేదని తెలియుచున్నది. శ్రు॥నతు తద్ద్వితీయమస్తి తతోఽన్య ద్విభక్తం యత్పశ్యేత్ - ముక్తినొందినవాఁడు వేఱొకవస్తువును జూచుటకు నతనికన్న రెండవవస్తువు లేదు. అనువాక్యంబును నీయర్థమునే తెలుపుచున్నది - శాస్త్రమునుబట్టియే ముక్తిస్వరూపమును తెలిసికొనవలయుగాన నిట్లు బ్రహ్మైక్యమే ముక్తియని స్పష్టమగుట లేదా ?

ఉ॥ శ్రు॥యత్ర నాన్య త్పశ్యతి॥ ఛాం॥౭॥౨౪॥౧॥ ఈవాక్యము నిరతిశయానన్ద రూప మగుబ్రహ్మము ననుభవించునప్పుడు ముక్తినొందినవాఁడు ఆనన్ద పారవశ్యమువలన నితరమును గమనింపఁ డనునర్థము గలదిగాన నీవాక్యము వేఱువస్తువు లేదనునర్థమును బోధింపదు గాఁబట్టి దీనిచే బ్రహ్మైక్యము ముక్తియని యేర్పడుట లేదు.

ప్ర॥ శ్రు॥యత్ర నాన్య త్పశ్యతి - ఈవాక్యమునకు నితరవస్తువు లేదనునర్థమే యేల గ్రహింపరాదు ?

ఉ॥ అందు - అన్యత్ - ఇతరవస్తువును - నపశ్యతి - చూడఁడు - అని యున్నది గాని ఇతరవస్తువు లేదని లేదు. ఇతరవస్తువే లేనిచో ఇతరవస్తువును చూడ డనుట యసంగత మగును. దీనింబట్టి యితరవస్తువు కలదనియే స్పష్ట మగుచున్నది - గాన నీవాక్యమునుబట్టి భేదమే లేదనిగాని బ్రహ్మైక్యమే ముక్తి యని గాని గ్రహించుట భ్రాన్తియేయని విశద మగుచున్నది.

ప్ర॥ శు॥నతు తద్ద్వితీయ మస్తి॥బృ॥ తత్ - ముక్తినొందినవానికన్న - ద్వితీయం - రెండవవస్తువు - నాస్తి - లేదు - అను నీవాక్యమువలన భేదము లేదని యేర్పడుట లేదా ?

ఉ॥ అందు - తతోఽన్య ద్విభక్తం॥బృ॥ ౪॥౩॥౨౩॥ అతనికన్న వేఱుగానున్నది యని ద్వితీయ మనుదానికి విశేషణము చేయఁబడియెను. అచట నిట్లు వేఱుగాఁ దోచునితరవస్తువు లేదనుటచే నితరవస్తువు వేఱుగాదోపక బ్రహ్మస్వరూపము గానే భాసిల్లునని తెలియుచున్నది. మఱియు - వేఱుగాఁ దోచునితరవస్తువు లేదనుటచే వేఱుగాదోపని యితరవస్తువుకలదనియే యేర్పడుచున్నదిగాన బ్రహ్మైక్యము ముక్తియనుట ప్రామాణికము గాదు.

ప్ర॥ సూ॥అవిభాగో వచనాత్॥ బ్ర॥౪॥౪॥౪॥ వచనాత్ - శ్రుతివచనమునుబట్టి - అవిభాగః - జీవబ్రహ్మలకు వేర్పాటు లేదని తెలియుచున్నది। అను సూత్రము వలన జీవబ్రహ్మైక్యము ముక్తియని సిద్ధించుట లేదా ?

ఉ॥ బ్రహ్మ మొక్కటిమాత్రమే యుండి రెండవవస్తువే లేనియెడ నందు విభాగము లేదనుట యనుచితముగాన ఆసూత్రమువలన ముక్తినొందినవానికి పరమేశ్వర సాయుజ్యమే (వేఱుచేయవలనుపడని సాంగత్యము) సంభవించునని మాత్రమే విశద మగుచున్నది.

ప్ర॥ శ్రు॥యథోదకం శుద్ధే శుద్ధ మాసిక్తం తాదృగేవ భవతి। విజానత ఆత్మా భవతి గౌతమ॥ కఠ॥ జ్ఞానముగలవానికి ఆత్మ - నీరునందు నీరుపోయగా గలిసి పోవునట్లే యేక మగునని కఠోపనిషత్తు చెప్పుచున్నది- మఱియు-శ్రు॥ యథా నద్య స్స్యన్దమానా స్సముద్రే॥ నదులువచ్చి సముద్రమునఁ గలియునట్లు ముక్తి నొందినవారును నామరూపములను వదలిపెట్టి బ్రహ్మమునందుఁ గలియుదురని ఛాందోగ్యోపనిషత్తు చెప్పుచున్నది. నీరు నీరులోఁగలిసినట్లు జీవుఁడు బ్రహ్మమునఁ గలియునని యుపనిషత్తులవలన స్పష్ట మగుచున్నదిగాన ముక్తి జీవబ్రహ్మైక్యరూప మైనదేయని యేర్పడుచున్నదిగాదా?

ఉ॥ ఈవాక్యములనుబట్టి ముక్తునకు నీశ్వరునకుఁగలసాంగత్య మధిక మైనదని తెలియుచున్నదిగాని జీవబ్రహ్మైక్యము ముక్తియని యేర్పడదు.

ప్ర॥ ఈవాక్యములవలన ముక్తి జీవబ్రహ్మైక్యరూపమేయని యేల యేర్పడదు ?

ఉ॥ ఇంతమాత్రమున నట్టియర్థము గ్రహించునెడ ॥శ్రు॥ సహబ్రహ్మణా॥ ముక్తుఁడు పరమేశ్వరునితోఁగూడి సకలభోగముల ననుభవించునని మొదలుగా ముక్తి దశయందు జీవబ్రహ్మలకు భేదముగలదని స్పష్టముగాఁ దెలుపు ననేకశ్రుతి వాక్యములు విరోధింపఁగలవు.

ఇదిగాక శ్రు॥ యథా నద్య స్స్యన్దమానా స్సముద్రే॥ ఛాం॥ అను శ్రుతివాక్యమే శ్రు॥ నిరంజనః పరమం సామ్య ముపైతి దివ్యమ్॥ ముక్తుఁడు పరమేశ్వరుని సమానరూపత్వము నొందునని చెప్పుచున్నది. శ్రు॥ యథానద్యః। అను నదీసముద్రదృష్టాన్తమాత్రమునుబట్టి నీరునీరుతోఁగలిసినట్టు లైక్యమే ముక్తి యని గ్రహించునెడ నావాక్యముచివర సారూప్యము వచ్చుననుమాట బాధించునుగదా !

ప్ర॥ సూ॥ముక్తః ప్రతిజ్ఞానాత్॥ బ్ర॥౪॥౪॥౨॥ అను బ్రహ్మసూత్రముచేత బ్రహ్మైక్యరూప మగునిర్గుణముక్తి చెప్పఁబడియె గాదా?

ఉ॥ ఆసూత్రమునందు - ముక్తః - ముక్తినొందినవాఁడు అనిమాత్ర మున్నది. ఆముక్తి నిర్గుణముక్తియని విశేషించి స్పష్టము చేయఁబడ దయ్యెను. కావున నందు జెప్పఁబడినది నిర్గుణముక్తియే యని గ్రహించుట న్యాయ్యము గానేరదు.

ప్ర॥ అచట నది సగుణముక్తియే యనియు నిర్ణయము చేయఁబడి యుండలేదుగాన నిఁక నది నిర్గుణముక్తియేయని యేల గ్రహింపఁగూడదు ?

ఉ॥ సూ॥భోగమాత్రసామ్యలింగాచ్చ॥ బ్ర॥౪॥౪॥౨౧॥ మొదలైనయనేకసూత్రములయందు సగుణముక్తియే తెలుపఁబడియుండెఁగాని మఱియేసూత్రమునందును నిర్గుణముక్తియున్నదని తెలుపబడియే యుండలేదుగాన నితరసూత్రముల యనురోధమునుబట్టి యీసూత్రమునఁ జెప్పబడినదియు సగుణముక్తియే యని విశద మగుచున్నది.

ప్ర॥ సూ॥ ముక్తః ప్రతిజ్ఞానాత్॥ బ్ర॥౪॥౪॥౨॥ అనుసూత్రమునఁ జెప్పఁబడినది నిర్గుణముక్తియే యని యేల గ్రహింపరాదు?

ఉ॥ అట్లు గ్రహించుట న్యాయ్యముగాదుగావున.

ప్ర॥ అది యెట్లు?

ఉ॥ శ్రు॥ అగ్నీషోమీయం పశుమాలభేత॥ అనువాక్యమున పశువును బట్టవలయునని మాత్ర మున్నదిగాని యేపశువైనది విశేషించి చెప్పఁబడదయ్యెను. అయినను శ్రు॥ఛాగస్య వపాయా॥ అను వేఱొక వాక్యమునందు ఛాగశబ్దముచేత మేక గ్రహింపబడియున్నదిగాన పశువని సామాన్యశబ్దముచేఁ జెప్పబడినది మేకయేయని గ్రహింపబఁడవలయునని సూ॥ఛాగోవా మంత్రవర్ణాత్॥జై॥౬॥౮॥౩౧॥ అనునధికరణమున నిర్ణయింపఁబడియెను. దానింబట్టి యిందును ముక్తియను సామాన్యమును జెప్పుపదమునకు సూ॥భోగమాత్రసామ్యలింగాచ్చ॥ బ్రి॥౪॥౪॥౨౧॥అని యీమొదలగు సూత్రములయందుఁ జెప్పబడిన పరమేశ్వరసారూప్యసాయుజ్యరూపమైన సగుణముక్తి యనువిశేషమునందుఁ దాత్పర్యముగ్రహించుటయే న్యాయ్యముగాని శాస్త్రమున నెచ్చటను ప్రస్తావింపఁ బడని నిర్గుణముక్తి పరముగా గ్రహించుట న్యాయ్యము గానేరదు.

ప్ర॥ ముక్తిదశయందు జీవేశ్వరులకు భేద మున్నదని కొన్నియుపనిషత్తులును - భేదములేదని మఱికొన్నియుపనిషత్తులును చెప్పుచున్నవిగదా? అభేదము నందే భేదవ్యవహారము సంభవించుఁగాని భేదమునందు నభేదవ్యవహారము సంభవింపనేరదు. ఎట్లన- శ్రు॥ స భగవః కస్మి న్ప్రతిష్ఠితః। స్వే మహిమ్ని॥ ఛా॥ ౭॥ ౨౪॥ ౧౧॥ పరమేశ్వరుఁ డెందున్నాఁడు. తనమహిమమునందే యనియు - శ్రు॥ ఆత్మరతి రాత్మక్రీడః॥ ఛా॥ ౭॥ ౨౫॥ ౨॥ తనయందే ప్రేమ గలవాఁడును - తనయందే క్రీడించువాఁడును ననియు నిట్లు అభేదమునందు భేదవ్యవహారము గలదుఁగాని భేదమే నిజమైనచో దానియందు నభేదవ్యవహారము సంభవింపదుఁగాన ముక్తిదశయందు భేదమే లేదనుశ్రుతులనుబట్టి జీవబ్రహ్మైక్యమే ముక్తియని గ్రహించుట యుక్తము గాదా?

ఉ॥ ఈశ్వరుఁడు తనమహిమమునందే యున్నాఁడనియు-తనయందే క్రీడించుచున్నాఁడనియు చెప్పుశ్రుతివాక్యములకు నీశ్వరుఁ డొక్కఁడే కలఁడుగాని వేఱొక ఈశ్వరుఁడు లేడనుటయందే తాత్పర్యముగాని వానికి నభేదమున భేదవ్యవహారము గలదనుటయందు తాత్పర్యములేదు - మఱియు - దంపతులకు - ఏకజాతీయులకు - స్నేహితులకును నిజముగా భేద మున్నప్పుడే వారొక్కఁటే యని భేదమునందే అభేదవ్యవహారము ప్రత్యక్షాదిసకలప్రమాణసిద్ధమై యున్నది. శ్రు॥ద్వా సుపర్ణా సయుజా సఖాయా అనుశ్రుతి జీవేశ్వరులిద్దఱును స్నేహితులని స్పష్టముగాఁజెప్పుచున్నది. దీనింబట్టి ముక్తిదశయందు జీవేశ్వరులకు కొన్నివచనములవలన భేదంబును మఱికొన్ని వచనములవలన నభేదంబును నున్నదని తెలియుచున్నను భేదమే నిజముగా నున్నప్పుడు వారిర్వురకుగల సాంగత్యవిశేషమునుబట్టి వారిద్దఱకు భేదము లేదనియు వారిద్దఱు నొక్కఁటే యనియు జెప్పుట ప్రమాణ సమ్మతమేగాన నంతమాత్రమున జీవబ్రహ్మైక్యము ముక్తిగాదనియు- సారూప్యము సాయుజ్యము ననుసదియే ముక్తిస్వరూపమనియు స్పష్టముగా నేర్పడుచున్నది. ఇట్లు బ్రహ్మైక్యము ముక్తికానేరదుగావుననే శ్రు॥స యది పితృలోకకామో భవతి। సంకల్పాదేవాఽస్య పితర స్సముత్తిష్ఠన్తి॥ ముక్తి నొందినవానికి పితృలోకము జూడవలయునని కోరిక గల్గునెడ నతఁడు తలఁచినంతమాత్రముననే పితృదేవతలు వచ్చి వానిని గొనిపోవుదురని శ్రుతి

చెప్పుచున్నది. బ్రహ్మైక్యమే ముక్తియగునెడ ముక్తునకు సంకల్పము గలుగుటగాని పితృలోకమునకుఁ బోవుటగాని యేదియు సంభవింపదుగదా!

మఱియు శ్రు॥ స ఏకధా భవతి॥ ఛాం॥౭॥౨౬॥౨॥ ముక్తినొందినవాఁడు ఒక్కరూపముతోఁగాని పెక్కురూపములతోఁగాని యుండుననియు శ్రుతి చెప్పుచున్నది. ఇదియు బ్రహ్మైక్యమే ముక్తియను పక్షమునందు గుదురనేరదు.

ఇదిగాక. సూ॥ద్వాదశాహవ దుభయవిధం బాదరాయణోఽతః॥ ల॥౪॥౪॥ ౧౨॥ అనుసూత్రమున ముక్తినొందినవానికి తనసంకల్పమువలననే శరీరము గలిగియుండుటగాని లేకుండుటగాని సంభవించునని సిద్ధాన్తము చేయఁబడియున్నది గాని శరీరములేకయే పోవునని యద్వైతులు చెప్పునట్టిపద్ధతి బ్రహ్మమీమాంసయందు జెప్పఁబడదయ్యెను.

బ్రహ్మైక్యము ముక్తి కానేరదుగావుననే శ్రు॥ సర్వాంశ్చ లోకా నాప్నోతి సర్వాంశ్చ కామాం స్త మనువిద్య విజానాతి॥ ముక్తినొందినవాఁడు సకలలోకములలో సమస్తసుఖము లనుభవించునని చెప్పినది సరిపోవుచున్నది.

మఱియు శ్రు॥ తం బ్రహ్మగంధః ప్రవిశతి। తం బ్రహ్మరసః ప్రవిశతి। ముక్తినొందినవానియందు బ్రహ్మయందుగల సకలసుగంధములు సమస్తరుచులును ప్రవేశించుననిచెప్పినసంగతులును సంగతము లగుచున్నవి. బ్రహ్మలక్షణము చెప్పునప్పుడు శ్రు॥ సర్వగంధః సర్వరసః॥ సకలసుగంధములు సమస్తరుచులును గలవాఁడనియు చెప్పి ముక్తునిగూర్చి చెప్పునప్పుడు బ్రహ్మమునందుగల సకలసువాసనలు సమస్తరుచులును ముక్తునియందు ప్రవేశించునని తెలుపుటచే బ్రహ్మము సగుణమే యనియు ముక్తునకు సగుణబ్రహ్మము దగుసమానరూపమే వచ్చుననియు స్పష్ట మగుటయేగాక నిర్గుణబ్రహ్మముగాని నిర్గుణబ్రహ్మైక్యరూపమగు ముక్తిగాని ప్రామాణికము గాదనియు తెలియుచున్నది.

ప్ర॥ శ్రు॥ సర్వగన్ధః సర్వరసః॥ అనుశ్రుతి సగుణబ్రహ్మపరమే యగుగాని పరబ్రహ్మపర మెట్లగు? ఇదియే పరబ్రహ్మపర మగుచో శ్రు॥ తథాఽరసం నిత్య మగంధవచ్చ యత్॥ పరబ్రహ్మమునందు గంధరసములు లేవని చెప్పినశ్రుతి విరోధింపదా?

ఉ॥ గంధరసములు లేవనగా దుష్టములైనవిలేవనియర్థముగాని మొదలేలేవనియర్థము గాదుగాన నాశ్రుతి యేమియు విరోధింపదు. అట్లుగాక నీశ్రుతికి గంధరసములే లేవని యర్థము గ్రహించునెడ శ్రు॥ సర్వగంధః అనుశ్రుతి విరోధించునుగదా!

ప్ర॥ సర్వగంధః సర్వరసః అనుశ్రుతి సగుణపరమనియు గంధరసములు లేవని చెప్పినది నిర్గుణపరమనియు సమన్వయము చేసికొనినయెడ నేమి విరోధము?

ఉ॥ ఇద్దఱు బ్రహ్మములున్నారని యంగీకరించుటే విరుద్ధము.

ప్ర॥ అట్లులంగీకరించిన నేమి?

ఉ॥ శ్రు॥ ఏకమేవాఽద్వితీయం బ్రహ్మ॥ అనువాక్యమునకు సజాతీయవిజాతీయాది భేదములు లేనిబ్రహ్మ మొక్కఁడే కలఁడని యర్థముచెప్పి బ్రహ్మము లిద్దఱని యంగీకరింపగా బ్రహ్మమునందు సజాతీయభేదము ప్రాపించుట విరుద్ధము కాదా?

ప్ర॥ పారమార్థిక దశయందు నిర్గుణ బ్రహ్మ మొక్కఁడేగాన నిఁకనేమి విరోధము?

ఉ॥ శ్రుతులయందుఁజెప్పఁబడిన సగుణబ్రహ్మము పారమార్థికము (నిజమైనది) కాద వఁగా శ్రుతులకు ప్రామాణ్యము నంగీకరింపనట్లే యేర్పడెను.

అదిగాక శూన్యసదృశమైన నిర్గుణబ్రహ్మమే పారమార్థికమనియు సర్వశక్తియుక్తమైన సగుణబ్రహ్మము మాయాకల్పిత మనియు నంగీకరింపఁగా నీశ్వరుని నిజమైనవానిగా నంగీకరింపని కారణమున నిరీశ్వరవాదంబును నంగీకరించినట్లే యగుఁ గాఁబట్టి సగుణ బ్రహ్మమునందే సకలశ్రుతులను సమన్వయించినశివాద్వైత సిద్ధాన్తమే న్యాయ్యమైనదని బ్రహ్మనిర్ణయమునందు నిరూపింపఁబడెను.

ఇదిగాఁక శ్రు॥ సత్యకామస్సత్యసంకల్పః॥ ఛాం॥౮॥౭॥౧॥ సత్యకామత్వము-సత్యసంకల్పత్వము మొదలగు మాంగల్య గుణములు బ్రహ్మమునకుఁ బోలె ముక్తునకును గలవని శ్రుతులవలనఁ దెలియుచున్నది॥సూ॥ ఉత్తరాచ్చే దావిర్భూత స్వరూపస్తు॥బ్ర॥౧॥౩॥౧౯॥ అనుసూత్రముచేత సత్యకామత్వాది బ్రహ్మగుణములు ముక్తుని యందును గలవని సిద్ధాన్తము చేయఁబడియున్నది. బ్రహ్మము నిర్గుణమే అయియుండి బ్రహ్మైక్యమే ముక్తియగుచో నీశ్రుతిసూత్రము లన్నియు నసంగతములే కావలసి వచ్చుఁగదా?

ప్ర॥ సూ॥ జగద్వ్యాపారవర్జం ॥బ్ర॥౪॥౪॥౧౭॥ అను సూత్రముచేత ముక్తునకు జగమును సృజించుశక్తి యుండదని నిర్ణయింపఁబడియెఁగదా? ఇఁక ముక్తునకు బ్రహ్మముతో సామ్య మెట్లు సంభవించును?

ఉ॥ ముక్తునకు జగమును సృజించుశక్తి లేకున్నను లోగడఁ జెప్పిన శ్రుతిసూత్రములనుబట్టి సత్యకామత్వసత్యసంకల్పత్వాది బ్రహ్మగుణములు గలుగునుఁగాన వానినిబట్టి సామ్యము సంభవించుచున్నది.

ప్ర॥ ముక్తునకు బ్రహ్మధర్మములు గొన్ని గలిగినంతన పరమసామ్య మెట్లు సంభవించును?

ఉ॥ త్రాసునందు బంగారమును కట్టురాతిని తూయగా ఎచ్చుతగ్గులులేక రెండును సమానముగానే యున్నవని తూనికనుబట్టియే సరిగా నున్నవను వ్యవహారము గలిగినట్లు కొన్ని ధర్మములనుబట్టియు జీవునకు ముక్తిదశయందు బ్రహ్మముతో పరమసామ్యము గలుగుననుట సమంజసమే యగుచున్నది,

ప్ర॥ సూ॥ భోగమాత్రసామ్యలింగాచ్చ॥౪॥౪॥౨౧॥అనుసూత్రమునందు మాత్ర పదముచేత ముక్తునకు బ్రహ్మముతో సామ్యము భోగమునందుమాత్రమే యుండునని చెప్పఁబడియెఁగాన పరమసామ్యము సంభవింపదుగదా!

ఉ॥ సూత్రములోని మాత్రపదమునకు సకలమునని యర్థముగాని - అందుమాత్రమే యను నవధారణము అర్థము కాదు - దాననే బ్రహ్మమెట్లు సకలభోగముల ననుభవించునో అట్లే ముక్తుఁడు ననుభవించునని భాష్యకారులవారు చెప్పియున్నారు. సకలైశ్వర్యములతోఁగూడినబ్రహ్మము ననుభవించురూపమున బ్రహ్మభోగసామ్యము కలదనిచెప్పుచు।శ్రు॥పరమం సామ్యముపైతి॥అనుశ్రుతి చెప్పినపరమసామ్యము నుపపాదింపనే యీసూత్రము ఏర్పడినదిగాన దీనికి పరమసామ్యము రాదనువిపరీతార్థము కల్పించుట యుక్తము గాదు.

మఱియు ఛాం॥ ౮॥ ౧౫॥ ౧॥ శ్రు॥ న స పునరావర్తతే॥ అర్చిరాదిమార్గమునఁబోయినవాఁడు తిరుగా రానేరఁడను శ్రుతివాక్యమును బట్టియు, సూ॥ అనావృత్తిశ్శబ్దాత్॥ బ్రహ్మమునొద్దకుఁ బోయినవాఁడు తిరుగారాఁడను బ్రహ్మసూత్రమునుబట్టియు పునరావృత్తిరాహిత్యము సగుణముక్తునకేయని తెలియుచున్నది గావున నిర్గుణముక్తి ప్రమాణసిద్ధముగాదని విశద మగుచున్నది.

ప్ర॥ అదియెట్లు?

ఉ॥ నిర్గుణముక్తియందు ముక్తుఁడు శరీరములోనుండి లేచిపోవుటయే యసంభవము గావున పోయినవాఁడు తిరుగారాఁడను శ్రుతిసూత్రములు సగుణముక్తినే సిద్ధాన్తము చేయుచున్నవి.

ప్ర॥ శ్రు॥ బృ॥ ౬॥ ౨॥ ౧౫॥ తేషా మిహ న పున రావృత్తిః॥ అర్చిరాదిమార్గముచేత సగుణబ్రహ్మమును పొందినవారికి ఈకల్పమునందు పునరావృత్తి లేదనియు శ్రు॥ ఇమమ్మానవ మావర్తం నావర్తన్తే॥ ఛాం॥ ౪॥ ౧౫॥ ౬॥ ఈసృష్టిలోనికి తిరుగా రానేరఁ డనియు, ఈ విధమున సగుణముక్తినొందినవారికి పునరావృత్తి

లేదనిచెప్పు శ్రుతులలో ఇహ - ఇమం-అనుపదములచేత ఈ కల్పమునందు ఈసృష్టిలోనికి మాత్రము తిరుగారారని యున్నదిగాన కల్పాంతరములలో సృష్ట్యన్తరములోనికి తిరుగా వత్తురని యర్థము సూచింపఁబడుచున్నదిగాన సగుణముక్తి స్థిరమైనది కాదని తెలియుచున్నది గాదా?

ఉ॥ శ్రు॥ ఛాం॥ ౮॥ ౧౫॥ ౧॥ న స పునరావర్తతే॥ ముక్తినిపొందినవాఁడు తిరుగా రాఁడను శ్రుతిని ప్రమాణముగా గ్రహించి శ్రీ వేదవ్యాసమహర్షి సూ॥ అనావృత్తి శ్శబ్దాత్॥ బ్ర॥ ४॥ ४॥ ౨౨॥ శ్రుతిప్రమాణమునుబట్టి అనావృత్తిః - పునరావృత్తి లేదని నిర్ణయించియున్నాఁడుగాన ముక్తిని పొందినవాఁడు వేరొక కల్పమునందు నింకొకసృష్టిలోనికి తిరుగా వచ్చుననుట యపార్థమేగాని యది సరియైన యర్థము గాదు.

ప్ర॥ ముక్తుఁడు వేఱొకసృష్టిలోనికి తిరుగావచ్చు ననుట యపార్థమెట్లగు?

ప్ర॥ వేఱొకకల్పమునఁగాని యింకొకసృష్టిలోనికిగాని ముక్తుఁడు తిరుగా వచ్చునెడ తిరుగా రానేరఁడనిచెప్పునది యెట్లు యథార్థమగును? పునరావృత్తి లేదని చెప్పుశ్రుతివాక్యములే ఇహ - ఇమం - అనుపదములచే నింకొకసృష్టిలోనికి తిరుగావచ్చునని సూచించుచున్నవనుటకన్న నేమి యాశ్చర్య ముండును? కల్పాన్తరమునఁగాని - సృష్ట్యన్తరమునఁగాని పునరావృత్తి యుండునెడ పునరావృత్తి లేదనిచెప్పినదాన నేమిలాభ మేర్పడియెను? నిరర్థకమే యగు గదా? కాఁబట్టి ఆశ్రుతులకు నట్టియర్థము విపరీతార్థమే యగును.

ప్ర॥ ఆశ్రుతులలోని ఇహ - ఇమం - అనుపదములకు నర్థమేమి?

ఉ॥ బహుదుఃఖములు గలదిగాన హేయమైన యీ ప్రపంచములోనికి ననియర్థము.

ప్ర॥ దానివలన నేమిప్రయోజనము ?

ఉ॥ సాధకునకు ప్రపంచముమీద విరక్తిగలిగించుమూలమున మోక్షపదమునెడ నభిరుచి గలిగించుట ప్రయోజనము,

ప్ర॥ ఆశ్రుతివాక్యములకు నిఁకనేనాటికి నేసృష్టిలోనికి రాఁడని యర్థము గ్రహింః నేమిసాధకము గలదు ?

ఉ॥ ఇఁక నేనాటికైన నేసృష్టిలోనికైన తిరుగా వచ్చుట సంభవించునెడ తిరుగ రాఁడనుట నిరర్థకమే యగుగావున.

ప్ర॥ అదియెట్లు ?

ఉ॥ తిరుగావచ్చుట సంభవించునెడ నీసృష్టిలోనికి వచ్చిననేమి? ఇంకొకసృష్టిలోనికి వచ్చిననేమి? ఎట్లును నేనాటికైన తిరుగావచ్చుట సంభవించునెడ తిరుగా రాఁడనుదానికి నర్థమే లేకపోవును.

ఇదిగాక శ్రుతివచనములకు శ్రీవేదవ్యాసులవారు నిర్ణయించినదియే యథార్థముగాని ఇతరులు గల్పించినది యథార్థము గానేరదు.

ప్ర॥ ఆవాక్యములకు వ్యాసులవారు ఏమియర్థము నిర్ణయించిరి?

ఉ॥ సూ॥ అనావృత్తి శ్శబ్దాత్-శ్రుతివలన తిరుగారాఁడనియే చెప్పిరిగాని అనావృత్తిరిహ శబ్దాత్॥ఈసృష్టిలోనికిరాఁడని చెప్పియుండలేదు కావున నావాక్యములోని ఇహ - ఇమం - అనుపదములకు ఈసృష్టిలోనికి ఈకల్పమునమాత్రమునని చెప్పినయర్థము విపరీతార్థమే యగును,

ప్ర॥ అట్లేని కొందఱావాక్యములకు నట్టియర్థము నేల చెప్పిరి?

ఉ॥ వారిమతమునందు, పోయినవాఁడు తిరుగారాడనుట కుదరమిచే విధిలేకయా శ్రుతిసూత్రములను సగుణముక్తిపరములుగానే యన్వయింపవలసివచ్చి యట్లే యన్వయించుచు సగుణముక్తి తమకు సమ్మతముగామింజేసి దానియందు నేదేని లోపము నారోపించునుద్దేశముతో నట్టివిపరీతార్థము గల్పించిరిగాని యా యర్థము శ్రుతితాత్పర్యసిద్ధముగాని వేదవ్యాససమ్మతముగాని కానేరదని యేర్పడియెను.

ప్ర॥ పోనిమ్ము - బ్ర॥౪॥౩॥౧౦॥ సూ॥ కార్యాత్యయే తదధ్యక్షేణసహ॥ అనునధికరణమునందు సగుణముక్తి క్రమముక్తియేగాని సద్యోముక్తి కానేరదని సిద్ధాన్తము చేయఁబడియున్నది కాదా?

ఉ॥ అచట చెప్పినది కార్యబ్రహ్మములైన హిరణ్యగర్భాదులయొక్క లోకములకు బోయినవారు హిరణ్యగర్భాదు లుండునంతకాలము వారితోగూడ భోగముల ననుభవించి యాకార్యబ్రహ్మములైన హిరణ్యగర్భాదులు సగుణబ్రహ్మము నొద్దకుఁబోవునప్పుడు ముక్తులును వారితోగూడ సగుణబ్రహ్మము నొద్దకు బోవుదురని యిట్లు కార్యబ్రహ్మములైన హరి హిరణ్యగర్భాదులలోకములకు బోయినవారి విషయముగాని సగుణబ్రహ్మమైన పరమేశ్వరునొద్దకుఁ బోయినవారివిషయము గానేరదు.

ప్ర॥ సగుణబ్రహ్మమే కార్యబ్రహ్మము గాఁడా?

ఉ॥ కానేరఁడు.

ప్ర॥ ఎందువలన ?

ఉ॥ సగుణబ్రహ్మమే సర్వకారణమైన పరబ్రహ్మముగావున.

ప్ర॥ హిరణ్యగర్భుఁడు సగుణబ్రహ్మ మేల కాడు?

ఉ॥ హిరణ్యగర్భుఁడు జీవుఁడేయయి యుపాసనీయుఁడుగామింజేసి కానేరఁడు. మఱియు - నారదాదిమహర్షులుసూర్యమండలము భేదించుకొనకయే బ్రహ్మాది లోకములకుఁబోవుచున్నట్లు కలదుగానను - బ్రహ్మాదిలోకములకుఁ బోవ నర్చిరాదిమార్గాపేక్ష లేదుగానను, అర్చిరాదిమార్గము పరబ్రహ్మప్రాప్తికే సాధనమని శ్రుతులయందుఁ జెప్పఁబడియున్నదిగావునను బ్రహ్మాదులు కార్య బ్రహ్మములేగాని సగుణబ్రహ్మములు కానేరరు.

ప్ర॥ ముక్తి జీవబ్రహ్మైక్యరూప మగునెడ స్వస్వరూపజ్ఞానముచేతనే లభ్యముగాన సాధకునకు స్వాధీనములో నుండును. ఇఁక నది సారూప్యసాయుజ్యరూప మగునెడ నీశ్వరాధీనమై యుండునుగాదా ?

ఉ॥ ముక్తి యెవ్వరి యధీనమున నున్నదియు శ్రుతినిబట్టియే గ్రహింపవలయుగాని మనసౌలభ్యమునుబట్టి గాదు.

ప్ర॥ శ్రుతి యెట్లు చెప్పినది?

ఉ॥ శ్వేతా॥ శ్రు॥ స కారణం కరణాధిపాధిప స్సంసారమోక్షస్థితి బన్ధహేతుః॥ కార ణమ్ - సకలజగమునకుఁ గారణభూతుఁడైన సః - అపరమేశ్వరుఁడే - కర ణాధిప - ఇంద్రియములకు నియంతయైన జీవునకును - అధిపః ప్రభువు- సంసారమోక్షస్థితిబన్ధహేతుః-సంసారమోక్ష - సంసారపాశము విడదీయుటకు- స్థితి - సంసారమున నిలుపుటకు - బంధ - సంసారపాశముబంధించుటకును - హేతుః-కారణమైనవాఁడు అని బంధమోక్షములు పరమేశ్వరునధీనములోనే యున్నవని తెలుపుచున్నది.

ప్ర॥ ఈయర్థము బ్రహ్మమీమాంసయం దెట్లు నిర్ణయింపఁబడి యున్నది?

ఉ॥ బ్ర ౩॥ ౨॥ ౫॥ సూ॥ పరాభిధ్యానా త్తిరోహితం తతోహ్యస్య బంధవిపర్యయౌ। జీవునిదగుజ్ఞానశక్తి - పరాభిధ్యానాత్, పర - అపరమేశ్వరునిదగు - అభి ధ్యానాత్ - సంకల్పమువలన - తిరోహితమ్ - మాటువడియున్నది - అస్య - ఈజీవునకు - బన్ధవిపర్యయౌ - బన్ధమోక్షములు - తతోహి - ఆపరమేశ్వరుని

వల్లనే ప్రాప్తించుచున్నవిగదా? అనుటచే జీవునిబంధమోక్షములు పరమేశ్వరు నధీనముననే యున్నవని నిర్ణయింపఁబడి యున్నది.

దీనింబట్టి బంధము స్వాజ్ఞానమూలంబును. మోక్షము స్వస్వరూపజ్ఞానసిద్ధము ననుటయు, నయ్యవి కల్పితములేగాని నిజమైనవి కానేరవనుటయు శ్రుతిసూత్ర విరుద్ధ మని సిద్ధించినది.

ఇట్లు మోక్షము సత్యమేయయి పరమేశ్వరు నధీనముననె యున్నది గావు వనే శ్రు॥తగ్ంహ దేవ మాత్మబుద్ధిప్రకాశం ముముక్షుర్వై శరణ మహం ప్రపద్యే॥ ముముక్షుః-మోక్షముగోరుచున్న-అహం-నేను-ఆత్మబుద్ధి-అనాదిపాశముచే మూయఁ బడియున్ననాజ్ఞానశక్తిని - ప్రకాశం - వికసింపజేయునట్టి - తమ్ - ఆజగత్కర్త యగు - దేవంపై - పరమేశ్వరునే - శరణం - రక్షకునిగా - ప్రపద్యే - ఆశ్రి యించుచున్నాఁడను, అనియు శ్రు॥ ధియో యోనః ప్రచోదయాత్ - యః - ఏదేవుఁడు - నః- మాయొక్క - ధియః - బుద్ధులను - ప్రచోదయాత్ - వికసింప జేయునో - అనియు శ్రు॥ సనో దేవ శ్శుభయా స్స్మృత్యా సంయునక్తు । సః - ఆ - దేవః - ఈశ్వరుఁడు నః-మమ్ములను - శుభయా- వికాసముగల - స్మృత్యా - జ్ఞానశక్తితో - సంయునక్తు - కూర్చుగాక - ఈశ్వరాజ్ఞానమన్విచ్ఛేత్ । ఈశ్వరాత్ - ఈశ్వరునివల్లనే-జ్ఞానమ్ - జ్ఞానమును-అన్విచ్ఛేత్ - కోరవలయుననియు - ఇట్లు - జీవునకు అనాదియగు సంసారపాశముచే మూయఁబడియున్న జ్ఞానశక్తి ప్రకాశనము పరమేశ్వరునధీనముననే యున్నదని యనంతములైన శ్రుతిస్మృతులు ఉద్ఘోషించు చున్నవి.

ఈ కారణమువల్లనే కఠశ్రు॥యమే వైష వృణుతే తేన లభ్యః॥ఏషః - ఈపరమేశ్వరుఁడు - యమేవ - ఎవ్వనినే - వృణుతే-అనుగ్రహించుచున్నాఁడో - తేన - వానిచేతనే - లభ్యః - పొందఁబడుచున్నాఁడనియు - బ్ర॥౪-౨-౧౭ సూ॥ తదోకోగ్రజ్వలనం తత్ప్రకాశితద్వారా హార్దానుగృహీత శ్శతాధికయా॥ హార్ద - ఉపా సింపఁబడిన హార్ద - హృదయముననున్న పరమేశ్వరునిచేత-అనుగృహీతః - అను గ్రహింపఁబడినవాఁడై - తత్ప్రకాశితద్వారా - ఆపరమేశ్వరునిచే ప్రకాశింపఁజేయఁ బడినద్వారముగల - శతాధికయా - నూటయొక్కటవనాడితో - అగ్రజ్వలనం - కాజ్వల్యమానమగు - తత్ - ఆ - ఓకః - మోక్షమార్గమును ప్రవేశించుననియు కలదు.

# మోక్షస్వరూపనిర్ణయము

మొదటినుంటియింతదనుక గావించినవిమర్శముంబట్టి మోక్షము పరమేశ్వర సారూప్య సాయుజ్యరూపమే యనుటయు, నయ్యది యుపాసనచే సుప్రసన్నుఁడగు పరమేశ్వరు ననుగ్రహమువల్లనేగాక వేరువిధమున దొరకనేర దనుటయు సర్వశ్రుతిసూత్ర తాత్పర్యసిద్ధ మని యేర్పడినది.

ఇట్లు-పరమేశ్వరసారూప్యసాయుజ్యములే మోక్షస్వరూపమైయుండియవిపరమేశ్వరోపాసనవల్లనే ప్రాప్యములు కావుననే పరమేశ్వరునితోఁగూడి యుండుటయనుసాయుజ్యమును సూచించునదియు - కీటో భ్రమరయోగేన భ్రమరో భవతి ధ్రువం। జీవోపి శివయోగేన శివో భవతి నిశ్చయః॥పురుగు తుమ్మెదతోఁగూడియుండుటచే తుమ్మెదయైనట్లు జీవుఁడు శివునితోఁగలిసియుండుటచే నిజముగా శివుఁడే యగుననుశివపురాణవచనమునుబట్టి భ్రమరకీటన్యాయమున శివసారూప్యమునకు సాధక మైనదియు నిరంతరపరమేశ్వరానుసంధానరూపముగాన నుపాసనారూపమై యనవధిక పరమేశ్వరానుగ్రహమునకు మూల మైనదియు నగుశివలింగ ధారణము మోక్షఫలక మైనవేదాన్తశ్రవణమున నధికారము గలుగఁజేయునదిగా-శ్రు॥ వ్రతమేత చ్ఛాంభవం తత్సమాచరే న్ముముక్షుర్నపునర్భవాయ॥ ముముక్షుః - మోక్షమున నిచ్ఛగలవాఁడు-నపునర్భవాయ - పునర్జన్మరాహిత్యముకొఱకు-శాంభవం-పాశుపతమనుపేరుగల - వ్రతం - లింగధారణదీక్షను - సమాచరేత్ - ఆచరింపవలయును - అనిమొదలుగా నుపనిషత్తులు నిర్ణయించినవి. ఆవిమర్శమంతయు, అధికారినిర్ణయమునందు గలదుగాన నందు గ్రహింపగలరు.

ప్ర॥ అద్వైతగ్రంథములయందు నిర్గుణముక్తి సిద్ధాన్తముచేయఁబడియున్నదిగదా?

ఉ॥ అప్పయ దీక్షితులవారు రచించిన అద్వైత శాస్త్రసిద్ధాన్త లేశసంగ్రహము, న్యాయరక్షామణి అనుగ్రంథములయందు యావ త్సర్వముక్తి సగుణబ్రహ్మభావో ముక్తస్య॥ సర్వజీవులకును మోక్షము ప్రాప్తించు నంతదనుక ముక్తునకు సగుణబ్రహ్మసారూప్యమే యుండునని సిద్ధాన్తము చేసియున్నారు. దీనింబట్టి సర్వజీవులకును ముక్తివచ్చుటవోలె నిర్గుణముక్తియు నసంభవమేయని యేర్పడుచున్నది.

ఇదిగాక కేవలాద్వైత సిద్ధాన్తమునందు జీవుఁడొక్కఁడే యనువాదమే సిద్ధాన్తముగా నంగీకరింపఁబడి యున్నది. జీవుఁడొక్కఁడేగాన బంధ మెవ్వ

కైనది మోక్షమెవ్వనికైనదియుఁ జెప్పవలనుగామిచే బంధమోక్షములు రెండును కల్పితములేగాని నిజము గానేరవని యంగీకరింపఁబడియెను. శుకుఁడు ముక్తి నొందుట స్వప్నములో నొక్కఁడు రాజ్యమునొందినట్లేయని తెలిపియున్నారు.

దీనింబట్టి జీవబ్రహ్మైక్యము ముక్తిస్వరూపమని యెన్నుట భ్రాన్తియే గాని యెంతమాత్రము నిజము గానేరదని తేలినది.

ఇట్లు పరమపురుషార్థ స్వరూపమును దెలుపునట్టి వేదాన్తవాక్యములవల నను వానియర్థమును నిర్ణయింపనేర్పడిన బ్రహ్మసూత్రములవలనను పరమేశ్వరుని పరమసారూప్యంబును, సాయుజ్యంబును ననునదియ మోక్షస్వరూపమని నిర్ణయ మైనది.

గీ॥ వరభరద్వాజమునిన కులవారిధీందుఁ
డుద్భటారాధ్య వర్య వంశోద్భవుండు।
నాగలింగాఖ్యుఁ డిట్టు లామ్నాయ శిఖల
నెగడు మోక్షస్వరూపంబు నిర్ణయించె॥

శివము